

# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# మల్లిఖార్జున శతకం




సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015419

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ధనసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ గురుభ్యో నమః

# శ్రీ మల్లికార్జున శతకము.

శ్రీజలజోద్భవాండములఁ ♦ జెన్నలరారు త్వదీయశక్తియే
యాజలజాప్తుగాఁ బరగి ♦ యాదర మొప్ప మదీయచిత్తవాం
ఛాజలజంబు లన్నిటికి ♦ సత్ఫల మియ్య బలిత్వమంది నన్
భూజనవంద్యుఁ జేయగదె ♦ భోగివిభూషణ! మల్లికార్జునా. 1

శ్రీధవపద్మజాదిసుర ♦ సేవితపాద! అనంతరూప! స
త్సాధులకల్పభూజ! యమ ♦ శాసన! యో నిగమస్వరూప స
ద్బోధక భక్తరక్షణ ప్ర♦భో యని నిన్మది వేడుచుండెదన్
మోదముతోడ నన్నెపుడు ♦ బ్రోవర శ్రీగిరి! మల్లికార్జునా. 2

అక్షయ! దుష్టశిక్షణ! య♦జాండనివాస! త్రిలోకపాలనా
ధ్యక్ష! మునీశరక్ష! నిగ♦మాంతవిహార! రమేశమిత్ర! రా
గక్షయ! దీనపక్ష! సుర♦కామితదాయి! శశాంకమౌళి! దు
ర్దక్షమదాపహార! యని ♦ ధ్యాన మొనర్చెద మల్లికార్జునా. 3

శాంకరి శారదాంబ సిరి ♦ శౌరి విరించి వినాయకుండు ని
శ్శంకితులౌచు నాహృదయ ♦ సారసమందు వసించి మించి యా
తంకము లేక నారచన ♦ తప్పక సాంగము జేయు గాపుతన్
శంకర! భక్తవత్సల! ని♦శాకర శేఖర! మల్లికార్జునా. 4

సూరిజనంబులన్ దలచి ♦ సొంపుగ నీపదసేవకావళిన్
గోరి కవీంద్రమండలముఁ ♦ గూర్మిని వేడి భవత్పదాబ్జముల్
మీరినభక్తి నాత్మ నిడి ♦ మేలుగ నుత్పలచంపకంబులన్
వేరులఁ గూర్చి నీకిడెద ♦ బేర్మి నుమాపతి! మల్లికార్జునా.

ఎవ్వఁడు జీవకోటి గడు♦నిచ్చ సృజించెను ? లోకమంతకుఁ
ఎవ్వఁడు కర్త ? దీనులను ♦ నేలెడి ధీరుఁడెవండు ?. దుష్టులఁ
నొవ్వఁగఁజేయువాఁ డెవఁడు ? ♦ నోముఫలంబుల జేర్చునట్టి వాఁ
డెవ్వఁడు ? నీవు గాదె ? మది♦నెంచఁగ శ్రీగిరిమల్లికార్జునా. 6

భోగివిభూష! సాధుజన♦పోష! ప్రదీప! కృపాంతరంగ వై
రాగవిలాస! నిర్గుణవి♦రాజ! శిరోజశశాంక శేఖరా!
యోగమవంద్య! దీనజన ♦ యార్తివిభంజన! భక్తపాలనా!
రాగమదాదిభంజన! ధ♦రాధరవాసక! మల్లికార్జునా. 7

కొండ నివాసమయ్యె మరి♦కొండయె చాపమునయ్యె జూడఁగా
కొండయె మామయయ్యె సతి ♦ కొండకుమారియు నయ్యె
కుంభజుల్
దండిగ భక్తులయ్యె నర♦దంబును భూతలమయ్యె నీకు, నీ
దండికి జాలినట్టి ఘన♦దైవము లేడిక మల్లికార్జునా. 8

పెట్టిన మొక్కఁకాండముల ♦ బేర్మిని రక్షణఁజేయుకర్త కుం
డట్టులఁ బుట్టఁజేసియు కృ♦పాంబుధి బ్రాణులఁ బ్రోచునట్టి బల్
జెట్టివి నీవయుండ నృప♦సేవలు జేయగఁ బోవనేల నిఁ
దట్టినభక్తిఁ గొల్వకయ ♦ ధారుణి మర్త్యులు మల్లికార్జునా. 9

పంతముఁగట్ట బోదు మది♦భక్తిగ నుండెదనంచు, నిన్నెదఁ
సంతసపెట్టు భక్తులకు ♦ సాగిలిమ్రొక్కఁగ బుద్ధిఁబోవ దా
కంతుని వాడిబాణముల ♦ గాసిలి గాసిలి మోహవాంఛలఁ
సుంతయు వాయ దీతనువు♦చూపర మోక్షము మల్లికార్జునా. 10

పాయదు క్రోధవర్గముల ♦ భక్తిని నీపదపద్మసేవలన్
జేయదు, తామసం బొదవు ♦ సేతలు మానదు, దీనరక్షణల్
బాయును, క్రూరతన్ దగిలి, ♦ భక్తులఁ గూడుచు సత్కృతుల్ దగన్
జేయదు, చిత్త మర్కట హా♦సింపక ప్రోవర మల్లికార్జునా. 11

శంకర! శాంభవీహృదయ♦సారసభృంగ! కపాలహస్త! ని
శ్శంక! దయాంతరంగ! శివ! శాశ్వతరూప! యటంచు నాదుహృ
త్పంకజమందు వేడుచు భ♦వాదృశు లీధర లేరటంచు నే
జంకక చాటుచుండెద ని♦శాకర శేఖర మల్లికార్జునా, 12

తిట్టియు గొట్టి మొట్టినను ♦ దిట్టరియై నిను బాధపెట్టినన్
చుట్టమె యక్కిరీటి? కడు♦సొంపుగ గాచితివయ్య; భక్తి నిన్
దట్టినచిత్తమందు నిను ♦ ధ్యాన మొనర్చిన గావకుండినన్
రట్టును బెట్ట ధర్మమె? ని♦రామయ శ్రీగిరి మల్లికార్జునా. 13

దారసుతాది బంధువులఁ♦దా విడనాడకయుండియున్ మదిన్
భారము నీదె యంచు నిను ♦ భక్తిఁ దలంచుచు భక్తసేవలన్
బేరిమిఁ జేయు నిర్గుణుడు ♦ పృథ్వినిఁ బాపము లొందడయ్య యా
నీరములందు తామరలు ♦ నిల్చినరీతిని మల్లికార్జునా. 14

జూదము లాడరాదు నృప♦సూనుడునైనను క్రీడలంచు, దా
జూదము లాడికాదె యమ♦సూనుడు దుఃఖులు దాను దారయున్
ఖేదము లంద గాన దరి♦గెన్ కురునాధుడు కారణంబుగా
బాధలు పెక్కులొందె, శ్రిత♦పాలన! శ్రీగిరి మల్లికార్జునా. 15

సత్యమె సౌఖ్యదాయిని య♦సత్యమె యాపద కున్కి సత్యమున్
నిత్యము వల్కు ముక్తిఁగాను ♦ సత్యము వాయ నఘంబు గల్గు నా

సత్యమె కీర్తి గూర్చును, న♦సత్యము జేయును నింద గుందగన్
సత్య మసత్యమందు గన♦సత్యమె యెక్కుడు మల్లికార్జునా. 16

జనకునివాంఛ దీర్పవలె ♦ సద్గుణశిష్టజనం బదెట్లు తా
మునుకొని తండ్రిసౌఖ్యము న♦మూల్యమటంచును పెండ్లిమానడే
ఘనుడగు జాహ్నవీసుతుడు ♦ గన్గొన మర్త్యులు వింతనొంద నో
ఘననిభగాత్ర! ఘోరభవ ♦ కాండవిభంజన మల్లికార్జునా. 17

ఘను డతికోపమొందునటు ♦ గర్వముతోడుత నొవ్వబల్కు యా
చెనటి నశించు నెట్టులన ♦ చెట్టతనంబున నెల్లరాజులుం
గన శిశుపాలు డాహరిని ♦ కాఱులు వల్కినగాదె చక్రధా
రను హాతుడయ్యె మున్ను శ్రిత♦రక్షణదీక్షిత! మల్లికార్జునా. 18

మూర్ఖులచెంత ధర్మమును♦మూఢులయొద్దను విద్యగొప్పయున్
కర్కశుసేవకత్వమును ♦ కాములసన్నిధి భక్తిబోధనల్
అర్కుడు రాగ చీకటియు ♦ నంగనహస్తమునందు విత్తమున్
శర్కరలై నశించు, నిది ♦ సత్యము శ్రీగిరి మల్లికార్జునా. 19

ప్రవిమలభక్తితో దలచు ♦ పావను డీధర నన్యవాంఛలన్
దవులగబోవ డెందు ప్రమ♦దంబున చూతఫలంబు లాను చి
ల్కవిడిచిముష్టికాయలను♦కాంక్షను మెక్కదలంచునొక్కొ యో
సవనవినాశ! యీశ! భవ♦సాగరతారణ! మల్లికార్జునా. 20

ప్రతిభగలట్టివారలకు ♦ బాములు మిక్కిలి గల్గు నెల్ల నం
చితమగుకీర్తిపుంజముల ♦ జెందుటకే, యదియెట్టులన్నచో
వెతలు త్రిశంకుసూనునకు ♦ పెక్కులు జేకురగాదె ధాత్రిపై
సతమగుపేరు గైకొనియె ♦ సాధుజనావన మల్లికార్జునా. 21

దొడ్డగుణాఢ్యుడా జనని ♦ దుర్భరశత్రువు జేరినంత దా
నొడ్డక కీడు, కాంక్షలను ♦ నొప్పగ దీర్చు నదెట్టులన్నచో
దుడ్డున మోది బంధ మిడు ♦ దుష్టునికైనను క్షీర మీయదే
దొడ్డగ ధేను పీఠరను ♦ దుర్జనభంజన మల్లికార్జునా. 22

తనదరి లేకయుండినను ♦ దాతగువాడు మరొక్కచోటనై
నను గొనియిచ్చు నర్థుల క♦నారత మయ్యది యెట్టులన్న దా
ఘనముగ సంద్రమందు గొని ♦ కాంక్షలుదీరగ నీర మీయదే
జనులకు నీలనీరద మ♦జాండనివాసక! మల్లికార్జునా. 23

సిరిగలవాని చెంత గడు ♦ జేరుచునుందురు తారుదారె యీ
నరు లీల నెట్టులన్నను ఘ♦నంబుగ రాజిలు రత్నపుంజముల్
వరలు నటంచుగాదె కడు ♦ వాంఛను జేరు నదీనదంబు లా
జలధికి ఫాలనేత్ర! గుణ♦సాగర! శ్రీగిరి మల్లికార్జునా. 24

గ్రాసము గల్గ భిక్షమును ♦ గంధము లుండ విభూతి భూషలం
బాసి మహోరగంబు లిలు ♦ బాసి భయంబిడు వల్లకాటిలో
వాసము మేల్ రథంబులను ♦ బాసియు నెద్దును బూనియుంటచే
వాసిగ త్యాగి వీవసుమి ♦ భక్తులు మొక్కగ మల్లికార్జునా. 25

1 రాలను రువ్వజాల నిను ♦ రంజిల 2 గొట్టగజాల తెడ్డుతో
3 బాలుని గోయజాల 4 కుల♦భామిని నీయగబోవజాల నీ
జాలిగ జూచి చయ్యనను ♦ 5 చక్కని నేత్రము దీయజాల న
న్నేలుము నీకటాక్షమున ♦ నీశ! కృపాకర! మల్లికార్జునా. 26

ముక్తికి మూలమౌ దయను♦మోదము గూర్చెడి నిర్గుణత్వముల్
శక్తిని నిచ్చు ధైర్యమును ♦ శాశ్వతకీర్తి నొసంగు సత్యముల్,

1. పు॥ 2. రాద్రసత్తక్క. 3. సిరియాళుడు. 4. భల్లాణరాజు. 5. బోయకన్నప్ప.

క్షితిపతియైన పఙ్క్తిరథు♦చేత వరంబుల నొంది కైక తా
బతి మృతినంద జేయదె కృ♦పానిధి శ్రీగిరి మల్లికార్జునా. 38

గర్వము జెందువా డెపుడు ♦ కష్టము లొందు నదెట్లనంగ దా
గర్వము గన్న బ్రహ్మ తమ♦కత్వముతో ప్రణవంబు నేనన౯
సర్వసుఖంబు బాసి చెఱ♦సాలను మ్రందడె తారకారిచే
శర్వ! మహేశ యీశ! హర!♦చంద్రకళాధర! మల్లికార్జునా. 39

పరులను హింసబెట్టిన నృ♦పాలుడు సైతము కీడునందు సో
దరియయినట్టి దేవకిని ♦ దత్పతియౌ వసుదేవు బైదున౯
కరుణరవంత లేకయిడి ♦ కందువులం బొలియింప శౌరిచే
మరణము కంసుడందడె ర♦మాధవ సేవిత! మల్లికార్జునా. 40

ఘనతరమౌచరిత్రముల ♦ గాంక్షను కొందరువల్కుచుండ యే
వెనటియునైన నిందనిడి ♦ చెప్పిన బాయదువన్న; మూర్ఖులౌ
మనుజులు గంగలో మునుగ♦మాయునె పాపము మానవాళికం
చనిహాసియింప, పోవునె మ♦హాత్వము గంగకు మల్లికార్జునా 41

క్షితిపతి యేనియుం జెడుట ♦ సిద్ధము దుష్టమనంబునం బతి
వ్రత జెరుపంగ బూనినను, ♦ వజ్రియె తొల్లి యహల్య గోరి తా
నతికఠినంపు శాపహతి ♦ నందడె యోనుల దేహమంతట౯
ప్రతిభ! గుణప్రదీప! సుర♦వందిత శ్రీగిరి మల్లికార్జునా. 42

ప్రవిమలమైనజ్ఞానమును ♦ బాగుగనొందక చేయు ధ్యానముల్
భవరహితంబొనర్పగల ♦ ప్రాభవమందగజాల వెందున౯
చవిగనుబెట్టు లుప్పిడక ♦ జక్కగవండిన కూర యేనియు౯
భవభయభంగ! యంగజవి♦భంగ! సురార్చన! మల్లికార్జునా. 43

వ్యయమును జేయగా నిల బ్ర♦యత్నము సేయని లోభి సంపదల్
జయమును మోక్షసౌఖ్యములు ♦ సద్యశ మీయగ లేవ దెట్లనన్
ప్రియసతి యోగిరంబిడిన ♦ బ్రీతిని మెక్కకయున్న దీరునే
రయమున బుట్టుక్షుత్తెపుడు ♦ రాక్షసభంజన మల్లికార్జునా. 44

గురువులయాజ్ఞ శిష్యతతి ♦ కూరిమిమీరగ దీర్పగావలెన్
ధర నెటులన్న ద్రోణుడు ము♦దంబునగోరిన ముద్ధవ్రేలు తా
గురునకు గోసియీయడె? య♦కుంఠితభక్తిని నేకలవ్యు డం
బరశిఖి! నందివాహా! హర ♦ పాపవిభంజన! మల్లికార్జునా. 45

సిరిదులదూగు వేళలను ♦ శీఘ్రమువత్తురు బంధువర్గముల్
సిరి తొలగంగ నొక్కడును ♦ జేరగరా డదియెట్టులన్నచో
పరిమళమున్న పుష్పముల ♦ బాగుగ దాలిచి, యవ్వివాడినన్
సరగున పీడజూచెదరు ♦ సాంబసదాశివ మల్లికార్జునా. 46

దీనులు గద్గదస్వరము ♦ దేజరిలంగ నుతించి వేడినన్
బూనడు ప్రేమ దుష్టుడగు ♦ పూరుషు డిద్ధరలోన నెట్లనన్
వానల గాని నీరముల ♦ వాసముఁ జేసినఁ గొండరాయి తా
బూనునె మార్దవంబు? నహి♦భూషణ! శ్రీగిరి మల్లికార్జునా. 47

చెనటులెయైనచో సుతుల ♦ సోదరులన్ పితులన్ మరెట్టివా
రిని నయినన్ హింసన్ జేసక ♦ శ్రేయముసుమ్మి యదెట్టులన్నచో
మును దశకంఠునిన్ విడిచి♦పోడె విభీషణు డాత్మసోదరుం
డనియయినన్ దలంపక కృ♦పాంబుధి శ్రీగిరి మల్లికార్జునా. 48

తా నధికుండనంచు మది ♦ తామస పూరితుడై చెలంగి తా
మానవులన్ హసింప సన♦మానము సేకురు నెందు నీర్ష్య గ

న్గానక వజ్రిసన్నిధిని ♦ గాధిసుతుండు వసిష్ఠు నోంప భూ
జానిని గెలిసేసి తప♦సత్త్వము వాయడె మల్లికార్జునా. 49

తనదరి జేరి దీను డతి♦తాపముతో శరణంబు వేడినన్
ఘను డభయంబు నిచ్చి కృప♦గాంచుట ధర్మ మదెట్లు డేగచే
వనటను గాంచు పావురము ♦ వచ్చి తగన్ శరణంబసంగ మే
నిని దగఁ గోసి యీయడె? విఁనిశ్చలుడై శిబి మల్లికార్జునా. 50

తాపము పొందుచుంటి మును ♦ తప్పుల నెన్ని యొనర్చినాడనో
పాపము జుట్టి న న్నధిక♦బాధలు వెట్టకు మోర్వఁజాల నీ
పాపగ నెంచి ప్రేమ బరి♦పాలన సేయవె కన్నతండ్రివై
తాపసవంద్య! భక్తజన ♦ తాపవిభంజన మల్లికార్జునా. 51

జననము కర్మబద్ధమగు ♦ సంపద లెల్లను నెండమావులౌ
తనయులు తల్లిదండ్రులును♦దారయు జూడ ఋణానుబంధముల్
ఘనతర సంసృతీజలధి ♦ గ్రాలుట యే చెరసాల ధాత్రిపై
మనుజున కేది శాంతి శశి♦మౌళి కృపానిధి మల్లికార్జునా. 52

క్రతువుల నెన్ని జేసినను ♦ కాంక్షను తీర్థములందు గ్రుంకినన్
వ్రతములు పెక్కు బూనినను ♦ భక్తిని బూజల నెన్ని చేసినన్
సతతము నిష్ఠలన్ గడిపి ♦ సత్కృతు లెన్ని యొనర్చినన్ మహా
మతిని నరుండు నిర్గనక♦మాయను దాటునె మల్లికార్జునా. 53

పవి సుమమౌ దవానలము♦వారియు నౌను నభంబు భూమియౌ
యవమతియైన శత్రు డమ♦లాత్మను మిత్రుడునౌ కఠోరమై
నవిషము గ్రాసమౌ, నగలె ♦ నాగములౌ మనుజుండు భక్తితో
శివశివయంచు వేడినను ♦ చిన్మయరూపక! మల్లికార్జునా. 54

జగతికి మేలుగూర్చుటకు ♦ సాధుజనంబులు ప్రాణమైన యే
వగపును లేక యిత్తురు కృ♦పామతితోడ, నదెట్లనంగ నీ
జగముల బాధఁబెట్టెడిని♦శాచరు జంపుటకై సురాళి కో
రగను దధీచి వెన్నెముక ♦ రంజిల నీయడె? మల్లికార్జునా. 55

ప్రవిమలభక్తులం గనలి ♦ బాముల బెట్టిన ధీరుడైన దా
భువి జెడు నెట్లనంగ మును ♦ పూజ్య మృకండతనూజు బట్టి తా
నషమతి జంపగా దలచి ♦ యంతకు డుగ్రత బాధబెట్టి నీ
పవినిభమైన బాణమున ♦ ప్రాణముఁ వాయడె మల్లికార్జునా, 56

తలఁపగ నొక్కనిం జెరుప ♦ దా మది నెంచిన గీడునొందు, తా
నిల, నది యెట్లనంగ జగ♦దీశుని గృష్ణుని జంపనెంచి తా
కులుకుచు వచ్చి స్తన్యముల ♦ గ్రోలుమటంచు నొసంగి తా నవే
హాలియగ లేదె పూతన వి♦భూతివిలేపన మల్లికార్జునా. 57

కృప గనగావలెన్ దనను ♦ గీర్తనఁజేసినవాని నెట్లో కీ
డపరమితంబుగా నొసగు ♦ నట్టి దురాత్మకునేని దొల్లి క్రూ
రఫణచయంబునన్ గరువ♦రా విదలించి పదాన ద్రొక్కినన్
గృపగనుమన్న కాళియుని ♦ గృష్ణుడు కావడె మల్లికార్జునా. 58

సమరసధీవిశేషమున ♦ జాలినవాడని కీర్తిగాంచినన్
విమలతరైకవిద్యల ప్ర♦వీణుడునై చరియించుచుండినన్
క్షమ ధనమున్ గడించునన♦గా వశమే మును పోతరాజు తా
నమలకవీంద్రుడయ్యును ధ♦నార్జన జాలెనె మల్లికార్జునా. 59

కినుక వహించి పెద్దలను ♦ గేలి యొనర్చుచు నొవ్వనాడ దా
ఘనుడయినన్ సుఖంబుచెడి ♦ కష్టములొందు నదెట్లనంగ సుయో

జనపతియగు పరీక్షిత్తుడు ♦ సన్మునిచంద్రునికంఠసీమ పా
ము నిడి వినాశముం గనడె ♦ భోగివిభూషణ! మల్లికార్జునా. 60

పరమపతివ్రతాత్వమును ♦ భంగము జేయఁదలంచువార లీ
ధర నవమాన మొందెదరు ♦ తామె, యదెట్లన నీవు స్రష్టయుఁ
సిరిమగ డల్లయత్రిముని ♦ చేడియయగు ననసూయఁ జేరి దు
ర్భరమగుకోర్కిఁగోరి పసి♦పాపలుగాఁగొనె మల్లికార్జునా. 61

పరహితముం దలంపని కృ♦పారహితుండు శుభంబు లొందలే
డరయ నదెట్లనంగ తన ♦ యాత్మను నిర్దయను బూని పాండు పు
త్రులనుసుఖంబువాయ నతి♦దుర్భరహింసలు పెక్కుఁగూర్చియా
కురుపతి యుద్ధరంగమున ♦ గూలఁడె శ్రీగిరి మల్లికార్జునా. 62

పరమకవీంద్రు కష్టములు ♦ పండితమాన్యు లెరింగి మన్ననల్
జరిపెద రంతెగాని కడు ♦ సన్నపువాడు గనంగ నేర్చునే
అరయ నదెట్లనంగ నిసు♦మంత యెరుంగునె గొడ్డురాలు దు
ర్భరమగు బిడ్డనొప్పులను ♦ పాపహరా! హర! మల్లికార్జునా. 63

తనకొమరుండు దుష్టుడని ♦ తాన యెరింగియు వానిచర్యలఁ
జనకుడు విశ్వసించినను ♦ సద్యశనాశము వంశనాశముఁ
గనియెడుసూ, సుయోధను♦డకార్యములం బచరింపుచున్న నొ
నని ధృతరాష్ట్రుడూరుకొన ♦ నందడె దుర్గతి మల్లికార్జునా. 64

వినయగుణాన్వితుఁ దయను ♦ వేత్తలు బోధలు చేసి జ్ఞానవం
తునిగ నొనర్చిమించెదరు ♦ దుష్టుని జేయగజాల రెట్లనఁ
శునకపుతోకవంకరను ♦ సొంపుగదీయగ శక్తులౌదు రే
పనిబడిచేయజూచినను ♦ పాపవిభంజన మల్లికార్జునా. 65

కలిమినిఁ జూచి చిత్తమున ♦ గర్వము నొంది మదించి మించి స
చ్చరితులఁ గష్టపెట్టునరు ♦ సంపద బాయు నిజం బదెట్లనన్
ధర త్రిపురాసురుల్ గడుమ♦దంబున దేవగణంబు నొవ్వగా
జరపి భవచ్ఛరాళిని ని♦జంబుగ జావరె మల్లికార్జునా.

పెద్దలసుద్దులన్ వినుచు ♦ పేరిమితోడ జరించునట్టివా
డిద్ధర నీప్సితార్థముల ♦ నెప్పుడు నందుచునుండు నెట్లనన్
పద్ధతి యిద్దియంచు హరి ♦ పల్కినపల్కుల మౌళిఁదాల్చి తా
యుద్ధములో కిరీటి కురు♦యోధుల గెల్వడె మల్లికార్జునా. 67

ప్రవిమలజ్ఞానబోధలను ♦ పామరసంతతి కెంత జెప్పినన్
చెవి జొరనేర వెట్లనిన ♦ చిక్కనియత్తరు గల్గుతొట్టిలో
దవిలి వసింప నుంచిన ము♦దంబున సూకర ముండ నేర్చునే
సవనవినాశ యీశ! హర! ♦ సాంబసదాశివ! మల్లికార్జునా. 68

సభ జనులెందరున్న గుణ♦సంపద గల్గినయట్టి పండిత
ప్రభు డొక డుండకుండినను ♦ రంజిలనేరదు, తారలెన్నియో
నభమున నున్న శోభగను♦నా శశియొక్కఁడు లేకయున్నచో?
నభయ! మహానుభావ యమ♦రాధిప శ్రీగిరి మల్లికార్జునా. 69

ఘనుడొక వేళ క్రూరముగ♦గాలులు పెక్కులు పల్కినన్ దయన్
మనిపి శుభంబు గూర్చుసుమి ♦ మాన్యులు మెచ్చ, నదెట్లు మేఘముల్
మునుకొని ఘాంఘమధ్వనులు♦ మ్రోవ దవానలమా యనంగ పి
డ్గును బడజేసియున్ జలము ♦ గూరిమి నీయవె మల్లికార్జునా. 70

ధనమును గూర్పనెంచి నిజ♦ధర్మము వీడి చరించువారికిం
ఘనభయరోగముల్ కఠిన ♦ కష్టము లెన్నియొ చేరువౌ, నదె
ట్లన నధికాశతో నృపుని ♦ లాలనజేయుచు మోసగింపనెం
చిన నల దుష్టబుద్ధి కడు♦చెట్టలు వొందడె మల్లికార్జునా. 71

ఘనుడగువాని గౌరవము ♦ గాకును జేసిన కీడు వొందడే?
గనగ నదెట్లనంగ ధన♦గర్వముతో నవనందు లుగ్రులై
మునుకొని గద్దెపై దనరు ♦ మోదగుణప్రదుడైన విప్రునిం
ఘనముగ లాగి చావరె జ♦గంబున శ్రీగిరి మల్లికార్జునా. 72

మాతకు మ్రొక్కుచుండుటయు♦మానక తండ్రికి బూజసల్పుటల్
తాతకు సేవఁజేయుటయు ♦ తాపసవర్యుల జేరి కొల్చుటల్
భూతగణంబుపై దయను ♦ బూనుట సజ్జనులైనవారికిన్
ఖ్యాతిగ నైజమైతనరు ♦ గాదె కృపాకర మల్లికార్జునా. 73

పాలును బువ్వఁబెట్టి దయ♦వర్ధిల మెక్కుమటన్న నోర్లకన్
మేలముజేయుబిడ్డలకు ♦ మేదిని లాలనఁజేసి పెట్టరే
చాలగ తల్లిదండ్రులు ని♦జంబుగ నట్టులె నీవు సత్కృపన్
పాలనసేయరావె నను ♦ భక్తజనావన! మల్లికార్జునా. 74

భక్తుల పాదతీర్థములు ♦ భక్తిని మౌళినిదాల్చి నిత్యమున్
రక్తిగుణేంద్రులై మదిని ♦ రాజసదూరులునౌచు నీకు స
ద్భక్తిగ సేవజేయుచును ♦ సద్గుణులై తగు భక్తులందరున్
ముక్తులు నీవు మెచ్చుటకు ♦ ముఖ్యపుబంటలు మల్లికార్జునా. 75

భోగివిభూష శూలధర ♦ పుణ్యచరిత్ర శశాంకధారి యో
యాగమవంద్య నీలగళ ♦ యంచు మదిన్ సతతంబుభక్తిమై

బాగుగ గోరి వేడితిని ♦ బాలనసేయర ప్రేమతోడుతన్
రాగమదాదిభంజన సు♦రార్చిత శ్రీగిరి మల్లికార్జునా. 76

బొట్టు విభూతి, భూషణము ♦ భోగి, సఖుండు కుబేరు డాలియా
గట్టులజేని బిడ్డ, నిజ♦కార్ముక మాహరి, తేరు భూమి, నీ
పెట్టెడి పువ్వు చంద్రుడును ♦ పెక్కులు నిట్టివి గల్గియుండగా
గట్టిగ భిక్షమెత్తుటకు ♦ కారణమేమిర మల్లికార్జునా. 77

తీర్థములందు మున్గినను ♦ దీక్షగ నోముల నెన్నిసల్పినన్
మూర్ధమువంచి మించి శివ♦మూర్తులఁ జేరి తలంచి మ్రొక్కినన్
సార్థకమేమి: జీవులను ♦ సాదరబుద్ధిని బ్రోవకున్నచో
నర్థపుకాంక్షపోక మది♦నాశను బాయక మల్లికార్జునా. 78

నీదరి జేరగోరి పర♦నిందలజేయక సత్యవాదులై
మోదముతోడ పుణ్యులకు♦మ్రొక్కుచు దీనుల వాంఛదీర్చుచున్
వాదములెంచకన్ మదిని ♦ భక్తిషడాక్షరి నొప్పబల్కుచున్
ఖేదము మానియుండెదరు ♦ కిల్బిషదూరులు మల్లికార్జునా. 79

లింగము కంఠసీమ నిడి ♦ లీల షడాక్షరి నుచ్చరించుచున్
బొంగుచు ప్రార్థనల్ సలిపి ♦ పూజలఁ జేయుచు సత్యదీక్షకున్
భంగముగల్గకుండ ఘన♦భక్తి జరించుచు భక్తరాశికిన్
వంగుచు సేవజేయవలె ♦ భక్తుడు నీధర మల్లికార్జునా. 80

పరులనుహింసబెట్టుటయు; ♦ భక్తుల నొవ్వగనాడుచున్ హృదం
తరమున కిన్కబూనుటయు, ♦ ధర్మముల న్విడనాడి యాశతో
సిరులకు నీచకృత్యములఁ ♦ జేయుట, భక్తిని వీడియుండుటల్
నిరతము వీరశైవమున ♦ నింద్యములౌసుమి మల్లికార్జునా. 81

శాంతము సత్ప్రవర్తన ని♦జంబునుబల్కుట భూతప్రేమ వే
దాంతపు గోష్ఠి భక్తియు ధ♦నార్జనపట్లను ధర్మపద్ధతుల్
అంతరమందునుంచుట ని♦జాప్తులరక్షణ కష్టమందు ని
శ్చింతయు వీరిశైవమున ♦ జెల్వగునీతులు మల్లికార్జునా. 82

కినుకయు, నీర్ష్యయుం బరుల ♦ గీటడగించి ధనంబు గూర్చుటల్
వనటను బొందుటల్, పరుష♦వాక్యములాడుటనింద మోపుటల్
కనికరబుద్ధిమానుటయు ♦ కామముతో విహరించుటల్ గనన్
నెనరుగ శైవుడైన గడు ♦ నీచుడెయౌగద మల్లికార్జునా. 83

లింగము హస్తమం దునిచి ♦ లీలను బ్రతిని బెట్టి పూజలం
భంగముఁజేయకే జరపి ♦ భక్తిగ నిన్మది వేడి నిత్యమున్
జంగపుసేవఁజేసినను ♦ స్వాంతము నీపయినిల్పియుండినన్
రంగుగ పుణ్యశాలియయి ♦ రాజిలునాతడు మల్లికార్జునా. 84

ప్రవిమలభక్తి యుక్తముగ ♦ పావనమైన త్వదీయనామముల్
దవిలిపఠించి నిర్గుణము ♦ దాలిచి దుఃఖముఁనొందకుండి దీ
నవరములిచ్చి శాంతమును ♦ నాటినచిత్తము బూనియార్ష్యలం
దవులకయున్నవాడు గను♦దప్పక మోక్షము మల్లికార్జునా. 85

ప్రవిమలజ్ఞానవహ్నిని య♦వారణదుర్గుణ వృక్షరాజముల్
దవిలిదహించి భస్మమును♦దాల్చి త్వదీయస్వరూపలింగమున్
భవములబాసికంఠమున ♦ భక్తినిగట్టెద భక్తులందరిన్
భువినిదలంచి కొల్చెదను ♦ బ్రోవర శ్రీగిరి మల్లికార్జునా. 86

తల్లియు దండ్రియు న్గురువు ♦ దాతయు దైవము బంధువర్గమున్
ఎల్లహితుల్ప్రియుండు నొగి♦నిష్టులు భాగ్యము తోడు నీడయుం

ఎల్లరు నీవెయంచు మది♦నింపుగ నమ్మి భజించుచుంటి నా
యుల్లమునందువెల్చి నను ♦ నొవ్వగ గావర మల్లికార్జునా. 87

చదువులు పెక్కు నేర్చి మది♦శాంతము పూని వినిశ్చితాత్ములై
ముదమున ధర్మమార్గులయి ♦ మోక్షపథంబునుగాంచునట్టి యా
సదమలబోధ జేయువారె ♦ జక్కనివాక్కుల శిష్యకోటికిన్
కుదురుగ వీరశైవమున♦కుం గల యొజ్జలు మల్లికార్జునా. 88

తనసుతులంచు శిష్యుల కు♦దారమనంబున ధర్మపన్నముల్
మునుకొని తెల్పువారలు ప్ర♦మోదమునొందువిధంబులెవ్వియో
కనుగొని సత్ప్రవర్తనుల♦గా నొనరింపుచు వీరశైవమం
దనవరతంబు బ్రోవవలె ♦ నారయనొజ్జలు మల్లికార్జునా. 89

భూతపిశాచఢాకినుల ♦ బూనిక ద్రుంచెడిదంచు భూమిలో
ఖ్యాతినిగాంచి మోక్షమున ♦ కాకరమయ్యెడిదోషడాక్షరిన్
భూతిని బెట్టులింగముల ♦ బూజల సేయుచునుండువారినే
భూతములుగ్రమైతగుల ♦ బూనుటచోద్యము మల్లికార్జునా. 90

పరహితంబుగోరి కడు♦పావనబుద్ధి జరించుచుండు స
ద్గురువులనాజ్ఞలన్నిటి న♦కుంఠితభక్తి నొనర్పగావలెన్
నిరతము వీరశైవులయి ♦ నీదరిజేరదలంచు భక్తులో
సురమునివంద్య దుష్టభవ♦శోషణ శ్రీగిరి మల్లికార్జునా. 91

హర హర శంకరా యనుచు ♦ నాత్మనుగోరి జపించి [illegible]
[illegible] ప్రశాంతమనస్కులునౌచు [illegible]
[illegible] తదయు ♦ భక్తి సత్కరించుచున్
[illegible] వీరశైవులయి ♦ [illegible] మల్లికార్జునా. 9[illegible]

ధరసతు దేహ శంకర ము♦దావహ శాంభవిచిత్తచోర భూ
ధరనిలయప్రదీప సుర♦తాపసవంద్య కృపాంతరంగ యుం
చరమర లేనిభక్తిని ని♦తాంతముగా జపియించువాడ నీ
కరుణను నాపయిన్ బరపి ♦ కావర శ్రీగిరి మల్లికార్జునా. 93

మునుకొని నీపదాంబుజము ♦ మోదముమీఱ శిరంబుపై ధరిం
చి నుతులొనర్చి నీకెపుడు ♦ సేవలు జేయుదునయ్య ప్రేమతో
నను గని ప్రోవరావె శివ ♦ నాగవిభూషణ శూలపాణి స
న్మునినుతభక్తవత్సల ప్ర♦మోదగుణప్రద మల్లికార్జునా. 94

ఎరుగను ధర్మశాస్త్రముల ♦ నెంచను నీపదభక్తి నెన్నడున్
గరువను కావ్యసంతతుల♦ గాంచగ పూర్వభవంబునందు నా
దురితమదెంతగాదనరి ♦ దుఃఖపయోనిధి ముంచునో హరా
సరగునగావుమయ్య నను ♦ సాంబసదాశివ మల్లికార్జునా. 95

భూధరజాతమీద నిజ♦భోగులమీద కుబేరుమీద నీ
గాధిలిగంగమీద ముని♦కాండముమీద కుమారుమీద శ్రీ
నాధునిమీద స్రష్టసుర♦నాధులమీదను జూపుప్రేమ నా
మీదను జూపి ప్రోవగదె ♦ మేదిని శ్రీగిరి మల్లికార్జునా. 96

శ్రీగిరివాస మానిగణ ♦ సేవితపాద యజాండపాలకా!
ఆగమవేద్య భక్తవర♦దా! హర! శ్రీభ్రమరామనోహరా
రాగమదాదిభంజన ప♦రాత్పరయంచు దలంచి నీకు నే
బాగుగ మ్రొక్కెదన్ గొనుమి ♦ భక్తునిగాననుమల్లికార్జునా. 97

పరులకు గౌరవంబొసగి ♦ బాగుగ గౌరవమందు సజ్జనుం
డరమరగల్గుబుద్ధిని దు♦రాత్ముడు కాన ఘనుండనంబడె

ల్లరు తనకంటెలోజ్జని యు♦లాఘవమందును తాను తానెయో
స్థిరగుణా! భక్తరక్ష! సిత♦దేహపరాత్పర! మల్లికార్జునా. 98

ఏమతమందు ధర్మరతి ♦ నెల్లెడ నుందురో శాంతచిత్తులై
నీమముతో జరించుదురో ♦ నీతిపథంబున బోవుచుందురో
కామముగెల్చి విద్యలను ♦ కాంక్షబరించినధీరు లుందురో
ఆమతమందు ధాత్రిపయి ♦ నందునుపూజ్యత మల్లికార్జునా. 99

ప్రథిముల వీరశైవుఁడను ♦ ఘట్టిసవీరయ్యకుఁ గుమారకుఁ
డ వసుధమల్లికార్జునుఁడు ♦ నాబడువాఁడను, లక్ష్మనార్యయుం
డ వరలు నీదుభక్తిపరు♦డై రచియించినవాఁడ దీని నీ
యవిరళసత్కృపన్ గొనుమి♦యర్పణజేసితి మల్లికార్జునా! 100

జయజయభక్తదీనజన ♦ సాధుమునీంద్రసురాళి రక్షణా!
జయజయ వీరశైవమత ♦ సంతతవర్ధిత మూలకారణా!
జయజయ మంగళప్రద ని♦శాకర శేఖర పాపనాశనా!
జయజయ స్రష్టశౌరినుత ♦ సంపద! శ్రీగిరి మల్లికార్జునా! 101

మంగళహారతుల్ గొనియు ♦ మామక కర్మముద్రుంచి ప్రేమతో
మంగళముల్ జెలంగ పర♦మార్థ మొసంగచు బ్రోవవే వెసన్
అంగజభంగ! లింగ! నగ♦జాధిప! కంజభవాండరక్ష! శ్రీ
రంగనుతప్రదీప! ముని♦రంజిత శ్రీగిరి మల్లికార్జునా. 102

సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# కేదారేశ్వర వ్రతకథ.

సకలసంపత్ప్రసన్నంబై ప్రమథగణవాంఛలం దీర్పం గల్ప భూజంబై ధవళకాంతులు దిగ్వలయంబుల నింపె, మోక్ష దాయిగాం దనరారు రజతాచలంబున, నొక్కదినంబున, కన కమణి స్థగితంబైన గద్దెపై యక్ష సుర సిద్ధ ప్రమథ హరి బ్రహ్మేంద్రాదులు పరివేష్టింప, సద్గానసంబున జగత్కర్త్రియగు శాంభవీసహితుండై మోదావహుండును బ్రహ్మాండసంరక్ష కుండును భక్తసులభుండును దీనమందారుండును దివ్యప్రభా వుండును నగు ముక్కంటీశ్వరుం డున్నసమయంబున, నర్ధాంగి యగు నాయంబ యిష్టాగోష్ఠిని నిజనాథుని నానందవార్ధి ముంచి యిట్లనియె.

"నాథా! త్రిలోకంబులం ద్రికాలంబుల శ్రేష్ఠంబులగు వ్రతంబులం దధికంబై చెన్నలరారెడి వ్రతన్నరత్నం బెద్దియో యానతిం డని ప్రార్థింప, నప్పరమేశ్వరుం డెద నతిముదంబు నొంది "కాంతా! నీకోర్కి ముల్లోకంబులవారికి శ్రేయో దాయకంబై తనరారెడిని. వ్రతంబులం దగ్రగణ్యంబై చెలు వొందువ్రతంబు కేదారేశ్వరవ్రతంబు. తద్వ్రతమహిమంబు దెలిపెద నిర్మలచిత్తవై యాకర్ణింపుము.

ప్రాణేశ్వరీ! న న్నర్చించుటవలన నఘనాశంబును పసు పుకొమ్ము లిడుటవలన సమస్తైశ్వర్యంబులును మధురంబులగు బూరె లిడుటవలన మృష్టాన్నభోజనంబులును, తాంబూల దానంబున సకలభోగంబులును, సరస్వతికి చలిమిడిం బెట్టుట

వలన సద్విద్యలును, వినాయకున కుర్రడాళ్లు బెట్టుటవలన
కార్యసాఫల్యంబును, నినుబూజించుటవలన మంగళప్రదంబును
భక్తపుంగవులభోజనంబున సర్వదేవతాసంతృప్తియు తోరం
బు ధరించుటవలన భూతపిశాచఢాకినీరాక్షసరోగ భయ
నాశంబును గల్గును. ఈవ్రతవిధానం బెద్దియన కార్తికశుద్ధ
నవమినాడు దంపతీయుతంబుగా నుపవసించి శుచిర్భూతులై
ప్రదోషకాలంబున హేమమయపీఠంబున మనయిర్వురిప్రతి
మంబుల నిలిపి మదీయప్రతిమంబునకు కేదారేశ్వరుం డను
నామం బిడి పూజించి నైవేద్యం బొసగి భుజింపవలయు. ఇవ్వి
ధంబుగా చతుర్దశివరకు నిష్ఠతో నోనర్చి పూర్ణిమనాడు భక్త
దంపతులనుగూడ నుపవసింపఁజేసి, భక్తితత్పరులై పసుపు
కొమ్ములు తమలపాకులు వక్కలు అయిదుమానికెలబియ్య
ముతో వండినబూరెల నిరువదియొకటినంతున బంగరుపాత్ర
యం దునిచి యిరువదియొక్కపోగులతో నల్లిన తోరంబు
గూడ నందుబెట్టి యాపళ్లెరము మనపీఠమున కెదురుగాఁ బెట్టి
యాగమోక్తంబుగాఁ బూజించి నైవేద్యం బొసంగి భక్తవ
ధూవరులచే దీవెనలం బడసి, వారిని నిష్టమృష్టాన్నంబులచే
దృప్తినొందించి కానుక లొసంగి వ్రతంబునకు స్వస్తిజెప్పి
తోరంబు కడుభక్తితో సందిట ధరింపవలెను. ఈవిధంబుగా
ప్రతిసంవత్సరంబు నోనర్పవలె" నని తెలుప పార్వతియిట్లనియె.

"మనోహరా! మీ రానతిచ్చినవ్రతంబు శ్రీమంతులకు
సాధ్యంబుగా నున్నదిగాని నిరుపేదలయినవార లెట్లోనర్తురు?
వారి కీప్సితంబులు నెరవేరు టెట్లు" అని యడుగ శంకరుండు

“కలకంఠీ! ధనవంతులు దరిద్రు లనుభేదంబు లైహికవాంఛా తత్పరుల కేకాని జ్ఞానులకు గానరాదు. భూచక్రం బేలు భూపాలుండయినను ఆశనువాయక దుఃఖితుడగును. నిరుపేదయయినను తృష్ణవిడిన దృప్తుండగును. నిష్కాముడై నన్ను బూజించి గరిక నిడినను మేరువుగా నెంతు వాంఛాతత్పరులు కనకకుసుమంబులతో నర్చించినను తృణంబుగా దలంతు. కాన భక్తిగలవారందరు నీవ్రతం బాచరించి కామితంబు లందవచ్చు” నన నక్కమలాక్షి “నాథా! యీవ్రతం బెవ్వారలయిన నోనర్చి ఫలం బొందిరా? అట్టివి గల్గిన వివరింపవే” యని ప్రార్థింప, అయ్యిందుధరుండు “కనకాంగీ! యీనోము నోచి శ్రీదేవి హరివక్షంబునను పలుకులవెలంది బ్రహ్మవాక్కునను శచి సురనాథుని చెంతను వసింపగల్గిరి. కృతయుగంబువారు నోచి త్రేతాయుగంబువారికి నాయుగంబువారు ద్వాపరంబువారికి నాయుగంబువారు కలియుగంబువారికి నెరింగించిరి. దీనికి నొక చక్కని యితిహాసంబుగలదు. వివరించెద నాకర్ణింపుము. కంజాక్షీ! శ్రీవీరశైవమతోద్ధారకుం డగు బసవేశ్వరుండు వసించు కళ్యాణనగరంబున సద్భక్తశిఖామణియు నిర్మలజ్ఞానియు నిరుపేదయు నగు కాంక్షభంజనుండు సునీతియను మగువనుగూడి కాపురము సుఖప్రదముగా జేయుచు మామక పదారవిందంబుల డెందంబున నిల్పి భక్తినిష్ఠలతో నానామంబుల స్మరింపుచుండు. అంత కొంతకాలంబునకు వారికి శీల, సుశీల యను నిర్వురు పుత్రికారత్నంబులు పుట్టిరి. వారిని ననురాగంబున బెనుచుచుండ నాబాలికలిద్దరును శుక్లపక్షక్షపాక

రునివలె క్రమంబున వృద్ధినిబొంది యుక్తవయస్కులై సుంద రాంగులై చెలంగిరి. కాని నిజజనకునియార్జన సన్నగిలుటవలన దినుట కన్నంబుఁ గానక సమీపారణ్యప్రాంతంబుల కేగి యిం ధనంబులం గొనితెచ్చి యంగడిని విక్రయించి యాధనంబున మాతాపితలంగూడి క్షుద్బాధలం దీర్చుకొని మదీయనామం బుల భక్తిని బ్రార్థించుచుండెను.

తదనంతరంబ యబ్బాలామణు లొక్కనాఁడు వనం బునఁ గట్టెలఁ గొట్టుచు మామకనామసంకీర్తనంబుం జేయు సమయంబున షణ్ముఖుండు భూలోకచిత్రంబులం గాననేగి కొంతవడి యిచ్ఛవచ్చినట్లు సంచరించి, తుదకచ్చోటికే తెంచి, యాబాలికలం గాంచి దయార్ద్రహృదయుడై ప్రచ్ఛన్నవేషం బున సద్బ్రాహ్మణుడై వారిఁజేరి బుజ్జగించి, ప్రణవసహితంబుగాఁ బంచాక్షరీమంత్రం బుపదేశించి సమస్తధర్మంబుల నెరింగించి వారిని శ్రీమంతులం జేయదలంచి కేదారేశ్వరవ్రతవిధానంబు దెలిపి చనియె. ఆకమలాక్షులును మొక్కవోనిసంతసంబున నిజగృహంబుల కేగిరి.

అంత కార్తిక శుద్ధ నవమి రా, నాకనకాంగులు ప్రొద్దుపొడువకమున్న లేచి ముద్దుముద్దుగా కాల్యకృత్యంబుల దీర్చి వృద్ధులగు నాజననీజనకులకుఁ జల్దు లిడి విపినంబునకు జని కొంతవడి కాష్ఠంబులఁ గూర్చి సాయంసమయంబున స్నానం బాడి మలినరహితలై నోమునోచుట కేమియు లేనందున నొక వటవృక్షంబుదరిఁ జేరి, పెద్దబండను పీఠంబుగాను నొక శిలను మదీయప్రతిమంబుగాను రక్తారుణనిభంబగుపంకంబుతో

జేసినబొమ్మను తావకరూపంబుగాను మరొక్క గ్రావమును వినాయకునిగాను నింకొకరాతిని వాణిగాను మఱ్ఱిఫలంబులు బాగాలుగాను ఆకులు తమలపాకులుగాను గులకరాళ్లు పసుపు కొమ్ములుగాను రేగడమట్టి బూరెలు పూర్ణాలుగాను మట్టిముద్ద లుండ్రాలుగాను బురదను చలిమిడిగాను భావించి, మదీయ విగ్రహంబునకు కేదారేశ్వరుం డని నామం బిడి నిర్మలచిత్తం బునఁ బూజించి నగరమునకుం జని కట్టెల నమ్మి తండులంబులఁ దెచ్చి, వంటనొనర్చి కేదారేశ్వరునకు నివేదనజేసి భుజించిరి. ఇట్లు త్రయోదశివరకు జరిపిరి.

పూర్ణిమనాటి రేయి వారు రేపటివ్రతం బెట్లు పూర్తి యగును, చేత నొకకాసైనను లేదాయెనే యని విచారించుచుండిరి. అంత తెల్లవారుజామగుటయు వారు లేచి కాల్యకృత్యంబుల దీర్చికొని సుచిర్భూతులై యావటవృక్షంబును జేరి చింతాక్రాంతచిత్తులై నను దలంచుచుండిరి. సూర్యాస్తమయకాలంబు దరియ వ్రతవిఘ్నంబగునని దుఃఖించి దుఃఖించి యలసి మూర్ఛిలిరి. అంత తద్వ్రతమహిమంబున నాచెట్టు ధివ్యభవనంబుగాను వారిడినపదార్థంబులు యథార్థపదార్థంబులుగాను మారి, సమస్తవస్తుసంబారములు కుప్పతిప్పలుగా నుండెను. వారు మూర్ఛ తేరిచూచి వింతఁబడి చూచుచున్నంతలో మదీయప్రమథులు ప్రచ్ఛన్నవేషులై దంపతీయుతంబుగా భక్తపుంగవులుగా రా, వారిని గాంచి సాష్టాంగనమస్కారంబులొనర్చి శీల నిజగృహంబున కేగి సర్వవృత్తాంతంబు దెలిపి తల్లిదండ్రులను గొనివచ్చి వ్రతంబు నెరవేర్చి భక్తులను నిష్ఠ

మృష్టాన్నంబుల దృప్తినొందించి, కానుక లొసంగ, వారును నక్కలకంతలను తగినవరులను చేపట్టెదరుగాతమని దీవించిచనిరి. ఆకాంతలు సంతసంబున వ్రతతోరంబుల సందిట గట్టి కేదారేశ్వరుని బూజించుచు సుఖంబుగా నాగృహంబున నుండిరి. అంత నొకనా డుజ్జయినీ నృపాలనందనుం డగు సద్గుణేశ్వరుం డేగుదెంచి శీలను, మరొక్కనాడు మధురభూపాలసుతుం డగు నిర్గుణాధీశుం డరుదెంచి సుశీలను, నుద్వాహంబుల నాడి వారిని వెంటనిడుకొని యేగిరి.

తదనంతరంబ యానూతనదంపతులతిసుఖంబుగాఁ గాపురంబులఁ జేయుచుండఁ గొంతకాలంబునకు శీలకు చిన్మయేశ్వరుం డను పుత్రుం డుదయించె. ఆమెయు వానిని గారాబంబున సాకుచు సంతసంబున నుండి యొక్కనాడు సందిట గట్టిన కేదారేశ్వరవ్రతతోరంబు నవరత్నంబులు చెక్కిన భూషణంబులదరి హీనంబుగా గనుపించిన నూలుపోగు నావంటి శ్రీమంతుల కుండజన దనిభావించి యూడబెరికి పారవేయ, మరునాడె యాపట్టణంబున గృహంబులు నశ్వశాలలు దగ్ధంబై ధనాగారంబులు చోరులవశమయి యరిష్టంబులు గనుపింప సద్గుణాధీశు డెద దిగులొంది జోస్యుల రావించి యిట్టి దుర్దశ గలుగుటకు కారణం బేమియని ప్రశ్నింప నాపండితులు దండిగా శాస్త్రంబుల దిలకించి "రాజా! నీభార్యయగు శీల కేదారేశ్వరవ్రతంబు విఘ్నంబుఁ జేయుటవలన నీకీడు సంభవించె" నని నుడివిరి. రాజు ధర్మవిరుద్ధంబైనకార్యంబున కుగ్రుడై యామెను పసికూనతో గానలకు పంపె.

అంత నాశీల భయంకరంబైన యాయడవియందు దిక్కుగానక తానుచేసినదుష్కృత్యంబునకు జింతించుచు నానామంబుల జపించుచు నన్ను మన్నింపవేయని ప్రార్థింపుచు దీనాననయై సంచరించుచున్న సమయంబున తారకారి తనచే నుపదేశం బందినకాంత కిట్టియిడుములు గల్గుటకు చింతించి యామెనుగాపాడ నెంచి ప్రచ్ఛన్నవేషంబున నొక్కమునియై యరుదెంచి యక్కాంతను నోదార్చి యొకయాశ్రమంబు గల్పించి దానియం దునిచి పోషించుచుండ గ్రమక్రమంబున నవవర్షంబులు జరుగ చిన్మయేశ్వరుండు దశవంవత్సరప్రాయుఁడై నిజజననిం జేరి, "తల్లీ! నాజనకుం డెవడు? మన మీముని యాశ్రమంబున నుండఁ గారణం బెద్ది? నే నీదుంప లాహారం బుగాతిని నారవస్త్రంబులఁ గట్టజాల. నాకు పురమందు వసింప కోరిక జనియించుచున్నది. మన కాప్తు లెవరైన గలరా?" యని ప్రశ్నింప నామె "ముద్దుబిడ్డా! ఉజ్జయినీనృపాలుండగు సద్గుణేశ్వరుండు మీతండ్రి. నామీదికినుకచే కానలకు బంప నీమునిపుంగవుండు మనలను గాపాడుచుండె. మధురాపురం బేలు నిర్గుణాధీశునిభార్య సుశీల మీపినతల్లి" యని తెలుప నాబాలుడు తనతల్లియాజ్ఞను తపసియనుజ్ఞనుగైకొని మధురకు బయనంబై కొన్నిదినంబుల కాపట్టణంబును జేరి, సింహద్వారంబుకడ కేగి తనవార్త ద్వారపాలకులద్వారా రాజునకు బంప సుశీలామనోహరు డెద సంతసించి, వానిదరి కేగి మూర్ధంబు ముద్దాడి సుశీలయొద్దకు గొనిపోయెను.

ఆమెయు నాబాలుని నిష్టమృష్టాన్నంబుల దృప్తిపొం దించి కుశలప్రశ్నలు జేయ నతడు "తల్లీ! నన్నును నామాతను మాతండ్రి కానలకు బనిపె. మే మొక జడదారియాశ్రమం బున నుంటిమి. మేము దరిద్రులమై బాధల బొందుచుంటిమి. మాబాధానివారణకై ధనము గావలె. అడబ్బు మీరిచ్చెద రని వచ్చితి" నన, నామె వారియిడుములకు చింతించి కొంతవిత్తంబు నిచ్చిపంప నాబాలుడు సంతసంబున బయనంబై నిజాశ్రమంబు నకు జనుచుండ మార్గమధ్యంబున నాధనంబు చోరు లప హరింప దిగులొంది, మరల వెనుకకు దిరిగి పినతల్లి కీవార్త జెప్ప నామె మరికొంతవిత్తం బొసగి కొందరభటుల నిచ్చిపంప వారు త్రోవనుబడి పోవుచుండ నొక్కచో నొకసరోవరంబు గానుపింప జలంబుల ద్రావ నాధనపుమూటలు తీరంబున బెట్టి కొలనులో దిగునంతకు, జలధిదేవత వచ్చి వారితో "నోచిన వారిసొమ్ము నోచినవారి కే గాని నోచనివారి కేలవచ్చు" నని మూటలను గొనిపోయెను.

అంత వారు వింతబొంది మధుర కేగి జరిగిన వృత్తాం తంబు దెలుప నాబాలుని కార్తిక శుద్ధ నవమివర కుంచి యాతనిచే దీక్షను బట్టించి నోము నోయించి వానిసందిట దోరంబు గట్టి తనసోదరికి నొక్కతోరంబును గొంతధనం బును నిచ్చి పంప నాబాలుడు సంతసంబున మార్గంబున వెళ్లు చుండ చోరులు తామపహరించినసొమ్ము నిచ్చిరి. జలధిదేవత తా గొనిపోయిన ధనపుమూట లాబాలుని కొసంగె. వా డతిముద మంది యాశ్రమంబు జేరి తల్లికి సర్వమునుదెలిపి యాతోరంబు

తల్లిసందిట గట్ట నామెకు అప్పటికిగల పాండురోగంబు నశించె. ఆమెయు పుత్రుండును సంతసంబున నుండ నొక్కనాడు సద్గు ణేశ్వరు డావనంబున వేటలాడుచు నాయాశ్రమంబు జేరి మునికి నమస్కరింప, నాతపసి, “రాజా! నీభార్య కేదారేశ్వరుని వ్రతంబు విఘ్నంబు జేయ నడవికి బంపితివి. ఆమె నాతావున పుత్రునితో సుఖమైయున్నది. కుమారునివలన వ్రతతోరంబు ధరించి పవిత్రతబొంది నది. గాన నామెను గొనిపొ”మ్మన రాజు సంతసించి నిజభార్యా పుత్రులను గొని పట్టణంబున కేగి, సుఖంబున నుండిరి. కావున నోపార్వతీ! యీవ్రతంబు విఘ్నంబునొనర్చిన గష్టముల పాలగుదురు. విఘ్నంబులేక చేయువారు సకలసుఖంబు లందెదరు” అని తెలుప నాయంబ సంతసించె. ఆశంకరుండును నాటికి కొలువు చాలించి నిజగృహంబున కేగి సుఖంబుండె.

---

సంపూర్ణము.